# వింతలమారి వీరమ్మ



ఈ గ్రంథము ప్రతిస్త్రీయును చదువ దగినది.

వెల 0–6–0, వి. పి. గా 0–8–0

☞ వలయువారు హిందూసుందరి మేనేజరు. కంతేరు,

కృష్ణా జిల్లా అని వ్రాయవలెను.

# సకుబాయి చరిత్రము ద్విపద






## ప్రథమాశ్వాసము.



శ్రీమనోనాథునా శ్రితజనోద్ధారు।
కామకోటి స్వరూపు కౌస్తువాభరణు।
శ్రీహరి నామది చింతించిచాల।
యాహరు త్రిపురారి నతిభక్తి గొలచి।
జలజోద్భవుని బాల సన్నుతుల్ జేసి।
కలుముల చెలిపాద కమలముల్ దలచి।
కడుభక్తి నంబికా కాంత కొరంగి।
విడునక వాణి పుస్తకపాణి వేడి।
విఘ్నముల్ దొలగింప వివిధార్చనముల।
విఘ్నేశుపాదముల్ వేడుకగొలచి।
సంస్కృతాంధ్రకవీంద్ర సంఘంబుగొలచి।
సంస్కార మొసగునట్ గురుని నుతించి।
ఘనమయిన సక్కుబాయను సాధ్వీచరిత।
ఘనులుమెచ్చగ ద్విపద గావింప దలచి।
నీదయనమ్మి నే నిదివేడు చుంటి।

వాదమేలరకృతి షరదగయుకొనుము।
దానవకులశిక్ష తాపసపోష।
గానవాద వినోద కరినాథ వరద।
భువననిర్మిత దేవ బుధజనభావ।
భవనాశ సర్వేశ పరమార్థసార।
మాధవ గోవింద మదనారివినుత।
వేదాంతవేద్య శ్రీ వేణుగోపాల।
నీకర్పితంబుగా నేజేయునట్టి।
యీకథాక్రమమెల్ల నిక వినుమయ్యా।
శ్రీకరంబై భువి జెలువారునట్టి।
ప్రాకటంబుగ కృష్ణవేణీతీరమున।
అఖిలసంపదలకాకరమై జెలంగు।
నిఖిలసూరిజనంబు నిలయమైయొప్పు।
కరవీర మనియెడు పురవరంబొకటి।
ధరణికి మొలనూలు తీరున నొప్పి।
నలకాపురముకన్న నధిక వైభవము।
వెలయుచునుండు సర్వేట సర్వేశ।
కోటి సూర్యులకన్న కోమరొప్పుచున్న
కోటలు కుడ్యముల్ గోపురంబులును।
మాణిక్య ఖచితమా మండపంబులును।
యున్నమహర్మ్యములచే సమగుపందిళ్లు।

పచ్చలతోరణ ప్రభలతో నొప్పి।
నచ్చుమాంకర్పూర మలరుదీపములు।
మేటియవు పుష్ప వాటికల చే మించు।
వాటమౌయుద్యాన వనములుమరియు।
కమనీయమైయొప్పు కాసారములును।
విమలోదకంబుచే వెలయుచు నుండు।
అయిరావతంబులై ననుధిఃఖరించు।
మేరుసదృశములై మెలగుకరులు।
భానురథంబువా రువములనయిన।
మానకఘోషించు మహితురంగములు।
చతురాస్యునయిన మెచ్చనియట్టి ద్విజులు।
యతులపరాక్రమ వంతులై నృపులు।
ధనపతిమించిన దనువైశ్యవరులు।
యనయంబు గృషి జేయు నట్టిశూద్రులును।
వెలయు నప్పురియందు విప్రుడొక్కరుడు।
సల్లలితంబగు పుణ్యా సంగతుల్ మాని।
సంసారబంధ విస్తారంబు చేత।
కంసారికలనన్ను బిలువనివాడు।
నాతనిపత్నియు నట్టిదై యుండు।
సుతుడొక్కరుండుండు సుగుణహీనుండు।
యిట్టికుటుంబము నింపొందనెంతో।

పట్టుగ వైకుంఠ పదవిని జేర్ప।
భువి నుద యించెనో చెలువొప్పనవగ।
శ్రీవిమల గుణఖని పరగంగసక్క।
బాయి యనెడుపేర బరగెడుసాధ్వి।
బాయక యాసుతు భార్యయై యొప్పె
యాయింతి స్త్రీదేవి యను కుంటిమేని।
యాయ లెరుంగక మహినొప్పుచుండు।
యాకొమ్మ భారతి యని యంటిమేని।
యాకొని తలవాకిట నుండ దెపుడు।
యాదంతి గమన శైలజయంటిమేని।
యాదంతశూక భూషణ భార్యగాదు।
యాలేమసౌందర్య మలవియే యెంచ।
బాలల కెల్ల మేల్బంతియా యింతి।
మొసగునీలపు సరుల్ మించినకురులు।
పరిపూర్ణ కళసోము బడలించు మోము।
తిలపుష్ప మువకన్న తీరునాశికము।
సలినాస్త్రి విలుహరాయల్ నవ్వుకన్బొమలు।
హరిణంబులజయించు నయనసంచు।
మెరుగుటద్దముబోలు మించు చెక్కిళ్లు।
యెలబింబముతీవి యెలరించు మోవి।
చలువశ్రీ కారముల్ చెలియకర్ణములు।

మృదుపల్లవంబులు మాటివహస్తములు।
చెలువయిన నీలంపు చికిలిరజంపు।
సొరవడితో బోఁకు నువిద నూగారు।
పసువృస నకనక బడుపేద నడుము।
వసుధసింగములతో వాదించగాను।
నిసుగ తిన్నెలబోలు నెసగు పిరుందు।
నంటి కంబములకీ డగునట్టితొడలు।
మరుని నిచ్చనల సామ్యంబు జెంఘికలు।
కెందమ్మి రేఖలగేరు పాదములు।
సందంబు తాజేళ్ల నడచు మీగాళ్లు।
ఘనితకు నిధియొల్ల వర్ణనగాను।
మనమునసే కొంత మాత్ర మెంచితిని।
అఖిలవిద్యాలయుందు యతివదా దేరి।
నిఖిలంబెరింగియూ యింతియు బరగె।
తనయిష్ట దయివంబు తగకృష్ణునుచు।
యనలేని భక్తిచే నెపుడెంచు చుండు।
మమకారములచేత మత్తులై యున్న।
మామయత్తనుజూచి మదినిట్లు దలచె।
యేలనోవీరికీ బాలిశత్వంబు।
చాలునుయీజాలి చాలించరేమి।
తలిదండ్రు లెవ్వరు తనయులెవ్వారు।

కలవంటిమాయ నిక్కముగా దలంచి।
పుత్రమిత్రాదులు బుద్బుదప్రాయ।
సూత్రమంతియె ముక్తి మార్గంబుగాదు।
కాయము స్థిరమని కడగాన లేక।
మాయకసంసార బద్ధులై కోర్కె।
మదిలోనగల్గి కామక్రోధ లోభ।
మద మోహమత్సర మాంద్యంబుచేత।
మదమత్తులగుచు దుర్మార్గులయ్యెదరు।
ముదమున భువిలోని మూర్ఖమానవులు।
యనితన మదినెంచి హాశ్చర్యమునను.
వనజాక్షి చింతించు వారలకొరకు।
మగనితో మెదిరించి మగువయెన్నడును।
తెగువుబాడదు బాధ తగిలినగాని।
యిరుగింట్ల పొరుగింట్ల కెప్పుడుజనదు।
జారకాంతలతోడి సఖ్యంబు గొనదు.
అత్తమామలమాట కడుగెత్త వెరచు।
చిత్తంబులోహరి జింతింపుచుండు।
పరమ పండరిపాండు రంగాయటంచు।
నిరతంబు ప్రార్థించు నెంతయుభక్తి।
పండరిపురవాస పరమ దయాళో।
ఖండితాఖిలపాప కాసకుతార।

షఃథు దైత్య సంహార దధిభాండ నోః॥
వదననిర్జితచంద్రి వరగుణ సాంద్రి।
సనకాదిముని స్తోత్రి సన్నుతపాత్రి।
కనకాద్రి నగధీర కామినీమార।
సలలిత మందార దాసచకోర।
కలితగాన వినోద కమలాధినాధ।
కరుణించుమనిసక్కు కాంతతానెపుడు।
కరుణాకరుని పాదకంద్వయముల్ దలచు।
వల నెప్పగా దాను జలమాడువేళ।
సలలితంబుగజీర సవరించు వేళ।
కన్నులకజ్జలం బులుదీర్చు వేళ।
యున్నంగ తిలకంబు నెఁగిదిద్దు వేళ।
పొలుపొప్ప జడయందు పువ్వులుంచు వేళ।
బహువిధాన్నంబులు బచరించు వేళ)
యహారహంబును యాది దేవునిదలచు।
పంఢరిపురవాస పాలించుమనుచు।
సండజయానతా సతిభక్తి వేమ।
పాండురంగని భామ పలుమారు దలచి।
పండరిపురిబోవ పయనమయి నిలచు।
యువ్విధంబున సక్కు యెంతయు భక్తి।
నివ్వటిల్లగ పండరీశుని దలువ।

జూచి సహింపక స్నుషిని జాల।
యేచుచూ నన్నపానాదులు నిడక।
కష్టపెట్టుచునున్న కలికియావంత।
నిష్ఠురంబు బల్కకెంతయుభక్తి।
ననయంబు తనబుద్ధి హరియందు నిల్పి।
యన్యచింతలులేక యవయవంబులనూ।
తనయింటి పనులలో వగిలింపజేసి।
మనసెల్ల హరిలోన మగ్నంబుజేసి।
వనిత తానొకనాడు వాకిలియలుక।
గని యత్త మొత్తగా దనమది జలచి।
చిత్తంబు హరిపయిని జేర్చి యున్నట్టి।
యుత్తమసతిగని యోర్వగా లేక।
లలన యలుకచునుండు వలువనుదీసి,
సలలితముగను నిల్లలుక లేదనుచు
సత్యకెంతయు బాధ సలుపుచునుండు
యక్కటికముబూన కత్తయేవేళ,
జలము దేబోయెడి జలజాక్షి పాత్రి
కలయకదూటిడి యతివను దిట్టు,
సరసాన్నపానముల్ సరగున నిడక
పరమపాతకియత్త బాధలుపరచు,
యిస్వపాపవులనున్న యింతులుగూడి,

పరుగునవచ్చియా పాపాత్ముగాంచి,
కోడలనిదియేమి కొమ్మగోచాల,
'నాడిపోసెదవన వారలదిట్టు॥
కోడలిసక్కను గొట్టుచునుండు,
వీడని యధికార వేగంబుచేత,
మామభర్తయుగూడి మగువను నెపుడు,
బాములొనర్తురు పరుష బాషలను,
యిట్టియిక్కట్లను యింతిసహించి,
దిటముతో మదినినీ తీరునెంచు
వీరునాపై ప్రేమ వారకజూప,
శ్రీరమాధవుమదిని జితింపమంతు,
గానని దేమేలు గానున్నదనుచు,
మానకతనలోన మగువ యూహించి,
మోహామెల్లను బాసి మోక్షార్థియగుచు
శ్రీహరిదలచితా చింతలువిడుచు
యీవిధంబగు శ్రమ కెంతయు నోర్చి,
నేవిధంబులస్వామి వేడెడుదాని,
సఖులెల్లజూచియా సతికిట్లు లనిరి
సుఖమును మాటయో సుదతినీ వెరుగ
నకటనీతలిదండ్రులాప్తులు లేరొ
యొకసారినినుజూడ యువిదరారేల,

పాండుపురమేది వనితేయటన్న'
వారికిట్లనిబల్కు వనజాయితాక్షి,
తండ్రిపే రడగితే తప్పకవినుము,
పండరినాథుండు పాండురంగండు,
తల్లిపేరడగితే తరలాక్షివినుము,
యెల్లభక్తులకల్ప వల్లిశ్రీలక్ష్మి,
వారిజాక్షిరో విను వాసుండునూను'
వపంచరంముగో వనిత నింజంబు,
వారికి శ్రీకుంబ వసుధలోసుతలు,
వారిలోనేనొక బాలనోయమ్మ,
యేలనోననుగాన కిసుమంత మరచి,
రోలల నామణి యచటికినేగు,
పాంథులగలరేని పణతిగోనాదు,
బంధనమెరిగింతు బాపగయనుచు'
యనితనవార్తల నాసక్కబాయి'
వనితలకెరిగించె వాత్సల్యముగను,
యిటులకొన్నిదినంబు లేగినపిదప,
పటుతరంబునవచ్చె బ్రహ్మోత్సవంబు,
మరినాషాఢమాస శుక్లపక్షమున,
పరమపండరి క్షేత్ర వరమహోత్సవము,
వేమరజాతంగ వేగమెజనులు'

యాడుచుయూసక్క భాయిమందిరము,
త్రోవనుజనియట కావలనున్న,
త్రోవగల్గినయట్టి తోటలోపలను,
కొందరు సఖ్యముల్ కొమరొప్పజేయ,
కొందరు భక్తులు గోవిందువేడ,
యిట్టివేళల యందు యిందీవరాక్షి,
గట్టిగతనచేత గడవనుబూని
వలనొప్పువనము లోపలనుకాసార
జలముదెచ్చుటకునై జనియెనువేగ,
యందునగలభక్త బృందంబుగాంచి
వందనములు జేసి వనితమోదమున,
కరమందు నున్న సుందరమయిన బిందె,
సరగున యటువైచి సఖియతాభక్త
వరులగూడి శ్రీహరి బాడి యాడి
పరవశంబయిమేను పణాతికంతంత
ఆనందబాష్పముల్ అతిధారగాగ,
మేనున పులకలు మొల్లవనెగయు
భజనజేయుచునుండ భక్తులుగూడి
గజరాజగామిని గృహమునుమరచి
యపుడుతనవెంట నేతెంచినట్టి,
కొప్పులకుప్పగా యువిదకొప్పుస్త,

గృహమునకేగియా గతిదల్పి నంత
గుహహా యికేమాయె ననియత్తమామ
తమకుమారునిజూచి తగనిట్టులనిరి
క్రమముగా నిదిజెప్పు కథవినుమయ్య
నీపత్ని పండరి పురికేగునట్టి,
పాపులనుష్టులవు భక్తులగూడి
శ్రీపతి భజనతా జేయుచున్నట్టి
లీలలజరించు నింతులుగలరె
కులమునకపకీర్తి కలికితాదెచ్చె
యిలనపకీర్తిబో నెలనాగనీవు,
ఫలితంబుగబోయి చయ్యనదెమ్మ'.
యనుచు దెల్పిననాత డతివేగమేగి,
కనితన పత్నిని గదసితా కోప,
మునజడబట్టితా మూర్ఖతనీడ్చె!
దెంపలు వేయుచు చెలినింటికడకు,
గొంపోయెనిదిచాల తెంపరియనుచు
నెలపండరీపురి బ్రహ్మోత్సవమునకు
నెలనాగబోవును నెంతయు భక్తి,
పడునయిదు దినములు బాగుగానింక
పదలకజరుగును వైభవంబచట,
గావున స్త్రీభాన గట్టుటేమేలు

యీవనితసటంచు నెంతయుద్ధలచి।
తలిదండ్రులగూడి దగవిచారించి।
మెల్లన స్తంభాన మెలతనుగట్టి।
బాధించిరీ శమనుని భటులచందమున।
బాధకెంతయనోర్చి పతివ్రతా భక్తి।
సేవేశనీశుని నెదనమ్మియుండె।
యావల బ్రహ్మోత్స వారంభమునను।
హరిహరయ బ్రహ్మరుద్రాదిదేవతలు।
బరువడి దివ్యవిమానము లెక్కి।
పండరిబ్రహ్మోత్స వంబుజూడంగ।
పాండురంగనిసేవ బాగుగజేయ।
వచ్చియుండిరిచాల ముచ్చటగాను।
నచ్చట గలయట్టి యఖిల భక్తులను।
సంతోషముననుతంబురలు మీటుచును।
నెంతయుభక్తి నాట్యములు సల్పుచును।
పరమ పురుషాయని ప్రస్తుతింపుచును।
బరమభక్తునిపాండు పతిగొల్చుచుండిరి।
యిచ్చటనక్కా బాయెంతయుభక్తి।
వచ్చెరిత్పనిమది జాలబ్రార్థించె।
జయభక్తమందార జయమహోద్ధార।
జయనిత్య కళ్యాణ జయజగత్రాణ।

జయపద్మదళనేత్ర జయనీలగాత్ర।
జయకరుణాపాంగ జయకీర్తిసాంద్ర।
జయపాపసంహార జయశుభాకార।
జయబాహుబలధుర్య జగదేకవీర్య।
జయభోగసుత్రామ జయగుణోద్దామ।
జయరమాహృదయేశ జయచిత్ప్రకాశ।
యనినినుకొనియాడ యలవియేనాకు।
ననుకరుణించక నాపాలిదేవ।
యనిసక్కుదాకర వీరపురమున।
దనుప్రార్థనముజేయ దయతోడ శౌరి।
తనకాంతరుక్మిణి గనియిట్టులనియె।
వనితశ్రీకరవీర పురమునను్న।
ఘనమయిన భక్తితో నెనకాని సక్కు।
యనయంబు ప్రార్థింపు చున్నదిదాని।
యుస్తహమ్ములు మొగు నతిబాధ పరుప।
చిత్తంబు నాపయిని జేర్చియేవేళ।
నన్నుజూడగ గోరె నళినాక్షి నాదు।
సన్నిధికిని తెత్తు సఖయ నేయిపుడె।
యనెరుక్మిణితోడ నాపాండు విభుడు।
పనిబూనిబల్కి తా పండరివదలి।
పరగనుత్సవము రేపనగ నారాత్రి।

కంపీరపురి జేరి నరవేషమూని।
సక్కతా నివశించు నిక్కముగ నేను।
మక్కువతో మందిరము కడనిలచి।
తనకరంబున కవాటంబు పట్టుకొను।
వినయాన నిట్లనె వెలదివినంగ।
అమ్మలారా పాండురంగని కృపను।
బ్రహ్మోత్సవంబగు నిమ్మగ నటకు।
నెవ్వరయినను జూడ నేతెంతురాయనుచు।
నవ్వనజాక్షుడు యతిప్రీతి నడుగ।
నమ్మా యహారితోడ ననెయెనా సక్క।
యమ్మ నే పండరి కరిగెద ననిన।
మానక స్తంభాన మగడు నన్ గట్టె।
యనిభాష్ప ధారలు యవనిపై గురియ।
వనిత చింతింపునా వనజాక్షు డుండు।
పనిబూని యిట్లని పడతితో బల్కె।
కదలక నన్నుయా కంబానగట్టె।
ముదముతో పండరి పురిజేరవమ్మ।
యనుచు నా సుందరి పెనుబంధ మూడ్చి।
వనజాక్షు నపుడు తా వనిత యల్లించె।
వదలక యావాటి యుపయాంబునందు।
మదనజనకుని గాంచి మరిసక్క యనుచు।

యత్తమామలు పెక్కు గతులు దూఁగను।
ని త్రిహారిసక్కు బాయియట్లుండ।
యన్నగపది యేను దినములనుంచి।
యన్నంబెఱుంగదీ యతివగా ప్రసను।
ప్పతిబొందగలదని మతిలోనదలచి।
పతిగాంచికరుణతో పతియిట్టులనియె।
యిటుమీద పెద్దల మటుమాయ జేసి।
యటుబోకయుండుమా యతివయనంగ।
కపటనాటకధారి కపటంబుబూని।
కపియించుచున్నట్లు తలయూచగానే।
పాశంబులనుయూడ్చి పతియేగెసంత।
పసు దేవుడులతన హృదయంబునందు।
యోచించెనిట్లని యూహాలేపార।
ఆచెర్యలనుజూడ నాతితాగోరె।
కృపమానియిపుడ దృశ్యంబైతినేని।
యుపకీర్తిపాలగు నాసతిసక్కు।
యనిమదియోచించి యంబుజోదరుడు।
పియయానపనులెల్ల వేడ్కతోదీర్చి,
పాకంబులనొనర్చి పతికత్తమామ,
కికమనంబున నింపుతోబెట్టి,
మగువతా భుజియించి పగలనుమాని,

మగనిమొద్దనుజేరి తగుభక్తితోడ
పాదపద్మంబులు బాగుగానొత్తి,
శేదదేర్చెనుసక్క చెలివలెహారియు,
తదనంతరముసక్క బాయితానేగు,
యదనునహారికీర్త నంబుజేయుచును
పండరిచేరెను నిండువేడుకను,
యండజయాన తానేగుచుత్రోవ,
మందారజంబీర మరువకవకుళ,
కుందనింబకదంబ కురువకాశోక,
పున్నాగహింతాల పెలుచయిసమంచి,
సన్నజాజులుమల్లె చామంతిలతలు,
పలుతెరంగులగూయు పక్షిజాతములు,
యలయకధ్వానిచేయు నళికులంబులను
గనుగొనియుల్లసి కాంతతాబలికె
వసజోపమునిగను వాంఛలుప్పొంగ,
తనదుదివ్యోదరాంతరమందు నఖిల,
వనజభవాండముల్ వహియించువాడు,
పరసకైవల్య బంధురయోగిచిత్త,
సరసిజంబులనెపుడు జెరియించువాడు,
తనువేడుభక్తుల కైవారగాచి,
యనయంబుమోక్ష ప్రాప్తులజేయువాడు

నివశించుపండరి నిలయుఁడుచ్చోట,
కావలనెంతటగ్గలు యనతిదూరంబు,
వినియెదఁజెల్పరే వేడ్కతో మీరు
ఘనకుంజములార కరుణతో నిపుడు
యనిబల్కియతివతా హరిమోసపుచ్చి,
జనెననియూహించి చెలియిట్టులనియె,
జీమూతగానరే దివ్య చారిత్రు,
రామామనోహరు రమణీయగాత్రు,
వేదంబగానవే వేదాంతవేద్యు,
నాదిదేవునిహరి నచ్యుతునజుని,
కౌశికగానవే కాంచనచేలు
కౌశికార్చితపాద కమలజుహరిని,
యనిభక్తిచేతస్మ యత్నాంబునొంది,
గిన్నదెల్లనుహరిగా దోచిమరలు
గాకున్నయటులయిన గాంతయూహ్లని।
హానకకాసార మరుభూములందు।
దిరుగుచునచ్చోట దవిలిచరించు।
వరమృగపక్షుల వనితతాగాంచి।
శ్రీకుంజరములార శింగంబులార।
శూకరభల్లూక శరభంబులార,
కాకఘూకములార కలహంసలార।

కోకిలతతులార కోకంబులార।
శుకశారికమయూర పికవేణులార।
సకలాంతర్యామి సత్ప్రభునీశు।
యకలంకుగానరా యనికాననంబు।
ప్రకటితంబుగదాటి పణతితానేగ।
తెలతెలవారె దిక్కులు తెల్లనయ్యె।
పలుతెరంగులగూసె పక్షిజాతములు।
గగనకామినిదాల్చె ఘనమైనరత్న।
నగయనంగను వెల్గె నభమునరవి।
యుదయమహామార్గాన దరుణితానేఁ।
బరగపండరిపుర వరమునచేరి।
గుంపుగురిపులుజేరి కోర్కెతోహరిని।
యింపుతోభజయించె విప్రపుంగవుల।
పద్మాసనంబున బరగగూర్చుండి।
పద్మాక్షునుతులు తప్పకసేయువారి।
కరములుముకుళించి కన్నులుమూసి।
చిరభక్తిభజనలు జేసెడువారి।
చనిచనిముందర సద్భక్తవరుల।
గనుగొనిమదిలోన కడుసంతసిల్లి।
తప్పకసాష్టాంగ దండంబులిడుచు।
యప్పురిమధ్యను యలరారునట్టి।

దేవళంబును జేరి తొయ్యలిభక్తి।
భావజజనకుని ప్రార్థించెనిట్లు।
ఆదినారాయణ వేదాంతవేద్య।
మాధవశ్రీహరి మంజులగాత్ర।
సంకర్షణాచ్యుత శంకరవినుతా।
పంకజనాభ గోపాలసర్వేశ।
సహజనిర్మలగాత్ర సత్యస్వరూప।
అహిరాడ్శయన విహంగతురంగా।
ఆదిసోమకుడు వేదములు మ్రుచ్చిలగా।
మాధవమత్స్యావతారమైనీవు।
జలనిధిజొచ్చి సోమకునట్టుజంపి।
యిలవేదములు నజునకిచ్చితివీవే।
అమరాసురులుగూడి యబ్ధినిదరువ।
విమలేంద్రకూర్మమై వెలసితివీవే।
ధరణియల్లనుచాప నగజుట్టుకొనగా।
వరహామైదనుజుని వధియించితీవే।
పరమభక్తుడు ప్రహ్లాదుండువేడ।
నరమృగమై యసురునిద్రుంచితీవే।
పరగవామనుడవై బలినొద్దకేగి।
ధరణిమూడడుగులు దానంబువేడి।
దానవుధరణికి ద్రొక్కితివీవే।

మానకఖలులెల్ల మహినిండగాంచి।
పరశురాముండవై పరగజన్మించి।
నరవరులను నిర్మూలి యొక్కమారు।
చెంచాడినట్టి ప్రచండుడవీవే।
దండిగారాక్షసుల్ ధరనెల్ల నిండి।
మునులనుసురలను మొనసిబాధింప।
యినకులంబునబుట్టి జనకుని యాజ్ఞ,
శాసనంబునకు కర్కితో నేగి,
మానకదనుజుల మడియించితీవే,
వసుదేవదేవకి సుతుడవైపుట్టి,
యసురులజంపిన యాహరివీవే,
బుద్ధరూపముదాల్చి పురవరస్త్రీల,
బుద్ధులుహరియించ బౌద్ధుండవీవే
కలియుగమందలి ఖలులనడంప।
కల్కిరూపముదాల్చు ఘనుడవునీవే
భువిస్థావరములు జంగములునునీవే,
యవనియాకాశంబు యబ్ధులునీవే
నినుగొనియాడంగ నేనెంతదాన,
ననురక్షింపవే నాపాలిరంగా,
యిల్లువాకలినీవె ఇష్టులునీవే
తల్లిదండ్రియు గురుదైవమునీవే,

దీపితంబుగనునా దేహమ్ముండగను।
నీపాదసేవనే నేడబాయదేవా।
సనమలనిన్నునీ జన్మార్ణవిడచి।
పొనలుచుకరవీర పురముచేబోవ।
యనిభక్తిపరవశమ్మై మేనువ వడశ।
చనువునహరికి సాష్టాంగంబు జేసి।
పదములపైనటు బాహింబువిడచె।
సనమలంబుగభక్తి జనులెల్లబొగడ।
అప్పుడాగుడినుండు అర్చకులెల్ల।
తప్పక పేరితము దయతోడ జూచి।
బాపలబిలపించి పణతినావలకు।
నేపుసగొనిపోయి లెల్లరుగూడి।
కరవీర పురమున కల్కినెపుంగు
వర బాహ్మణోత్తముల్ వద్దనుజేరి
జలగుచుభీమా జలంబులయందు,
యలప్రేతమును స్నానమాడించిమించి,
తిరువణిశ్రీ చూర్ణ మరయంగబెట్టి
కరమరుదుగను సంస్కారముల్ జేయ,
బ్రహ్మరథలబుపై ప్రేతంబునుంచి
బ్రాహ్మణుల్ పండరి పురిచుట్టుదిప్పి,
వరభీమ తీరాన వనితనుదించి,

సరలిగనగ్ని సంస్కారముల్ జేసి,
ఆసాధ్వీమణివస్త్ర భూషణంబులును
భూసురుల్ తమవెంట పాలుపొప్పగొనుచు
పరపండరిని బాసి వేళంబజనిరి,
కరవీరపురిసక్కు గతిదెల్పగోరి,
పాకులేగినవనంత పద్మదళాక్షి
శ్రీరుక్మిణిల్లని చింతించెనదివి
యెన్ని దినములేగె పన్నగశయను
డెన్నగరాజ్ఞాయె నేలకోయనుచు,
మదిరెంచిచూడగా పదలకసక్కు
మందిరంబునదాను మగువయున్నంది,
సేవజేయువిధంబు చెలితానుగాంచి,
భావంబునను చాల పరితపింపుచును
ఆ కేశముఖమునా అఖిలభక్తులను,
భావించి యిట్లని రమణితాబల్కె
పండరినాథుండు భక్తికి జిక్కి
పుండరీకసక్కింట పక్కయున్నాడు,
యత్తమామయుపతి వతివబాధింప
వృత్తులపడుచుతా నొనరంగనేగి
ఘక్కబంధనములు జెయ్యన నూన్చి
యక్కడ నున్నాడు యాతివపై ప్రీతి,

యనుచు నవ్వాకలు యతివరాదల్పి,
వనజాక్షుకిటువచ్చు వలనునెరిగింతు
వినుడని యిట్లని వినుపింపదొడగ,
అనఘాత్ములార మీరందరు వేగ,
యలస్మశానము కేగియస్త్రులనెల్లా,
కలయంగ గాంచి కర్ణముకడ నిడనా,
యంగనయస్త్రులు యలరుచుపొంను,
రంగరంగాయని రయమున బల్కు
నవిహారి సన్నిధి కరయంగ దెచ్చి।
యువిదరూపముగాను యొసరించి భక్తి,
భజనలు జేసిన పణతి జీవించి,
నిజమందిరముకేగు నిటువచ్చు హరియు
అనియిట్లు రుక్మిణి యాజ్ఞ నిడంగ
జనిప్రేత భామిని చెలియహస్త్రులను.
గని చెవి చెంతను గ్రమ్మర నిడనా
వనితహస్త్రులుహరి వర్ణించె నిట్లా
వేదానవేద్యనీ పాదంబులెపుడు,
నాధాయమన్ననిమ్త్ర తచ్చుతరంగా,
యింక ముందుననేను నెరిశేయుపాప,
బృందంబుబాపి యింపొంద నన్నేలు,
కన్నమోనులనెల్ల నన్నుదోరియకను,

విన్నపమాలించి వేగరక్షించుము।
దాసానుకూలనన్ గాసిబెట్టకను।
దోసంబులెల్లను దొలగించిగావు।
యనిభజించెడుసక్కు అస్తులన్నియును।
పనిబూనిభక్తులు పరగంగసేరి।
రంగనిసన్నిధి పొంగుచునిడియూ।
సంగీతములపాండు రంగనివేడా।
కమలగర్భునిగన్న ఘనుడుయావేళ।
కమలాక్షిసక్కుకు గ్రక్కునప్రాణ।
ములనొసంగియుభక్త ముఖ్యులనెదుట।
నిలిపినవారంత నిశ్చేష్టులగుచు।
పలువిధంబులపాండు సతినుతియించి।
యలనాగతాలేచి యంతయుభక్తి।
భజనజేసెనుపాండు రంగా యటంచు।
యచటివారలుజూచి హాశ్చర్యమొంద।
యంతశ్రీరుక్మిణి యెంతయుప్రేమ।
కాంతామణినిజూచి ఘనముగాబల్కె।
కమలాక్షినీవు యిక్కడకేగుదెంచి।
యమరేంద్రవంద్యుని యర్చించిభక్తి।
దేవేశనిన్నుయీ దేహముండగను।
నేను విడువగజాల నిక్కమీమాట।

యనుచువైరాగ్యాన యతివబల్కితివి।
ఘనపాండుపతిమోళిల గావుననిపుడు।
శపదమీడేరె మరుజన్మంబు గలిగె।
చపలాక్షి పురికీవు సరగునజనుము।
యని వచించినలక్ష్మి ఘనమృదూక్తులను।
వనజాక్షియాలించి ఘనమయినభక్తి।
కరయుగంబులమోడ్చి కల్కికిమ్రొక్కి।
పరమభక్తులకు జోహారులొనర్చి।
కరవీరపురికేగ గ్రక్కునకదలె।
పరమేశ్వరునిపాండు పతిభజింపుచును।
నీపదంబులసేవ నేడునాకబ్బె।
యాపదలనుబాసె యమితదయాళో।
యని వినుతింపుచు యతివతానేగ।
కనకాంబరుడుగంగ ఘటముచేబూని।
సలలితంబగు కృష్ణ సరసకునరిగి।
జలజాక్షుడునుసక్కు సంధించిరచట।
మాయలహరిసక్కు బాయికిట్లనియె।
పోయివచ్చితెపాండు పురికీవుబ్రీతి।
రంగనిమనసార రమణిరోగంటే।
మంగళకరమై మగువ యొప్పినదే।
యనిహరుసక్కును వడుగనిట్లనియె।

మానసహరునితో మగువయాసక్త।
ధరనీదుదయచేత తరుణిరోవినుమా।
పరగ బ్రహ్మోత్సవము పండిరిగంటి।
బరువడియిటువలే ప్రతివత్సరంబు।
మరువకయుంపు మా మగువరోయనుచు।
హారి పదంబులకునూ యతివసాష్టాంగ।
మొరిగిలేవకయున్న మురహారిప్రేమ।
కరయుగంబులుజాచి కలికినియెత్తి।
వరరూపమదినుమాని వనజాక్షుడంతా।
ప్రత్యక్షమయి నిలచె పడతికక్కడుట॥

సమాప్తము.



సుందరుల మందారము!! **హిందూసుందరి** రమణుల యాదరణము!!!



ఇదిప్రత్యేకము స్త్రీలకొఱకు ప్రచురింపఁబడు మాసపత్రిక. విదుషీమణియగు శ్రీమతి మొసలికంటి రామాబాయమ్మగారు దీనికి సంపాదకురాలు. ఇందు పాతివ్రత్యము, దైవభక్తి, గృహిణీధర్మములు, శిశుపోషణము, గృహనిర్వాహక విధులు మొదలయిన స్త్రీలకత్యంతోపయుక్తములగు విషయములు పండితులగు నారీమణులచే వ్రాయఁబడుచుండును. పురాణకథలు, నవీన చరిత్రలు, పరిహాసములు, పద్యములు, ఉపన్యాసములు, సాధ్వీమణుల జీవితము, ఇందువిశేషముగనుండును కుట్టుపనులు నేర్చుకొనువిధము, పూలచెట్లపెంచుతీరు, ఉపాధ్యాయుఁడక్కరలేకుండ విషయము బోధపడునట్లు సరసముగాబొమ్మలతో వ్రాయఁబడును. మంగళహారతులు, కీర్తనలు, పాటలు, మొదలగునవి యుండును. ఈవిషయమావిషయమననేల అతివలకత్యంతావశ్యకములగు అన్ని విషయములిందుండును. చదువునేర్చిన ప్రతిస్త్రీ చేతనుండవలసినది.

## చందాపద్ధతులు.

| | |
|---|---|
| చందాదారులకు సం॥కి పోష్టేజితో | 2రూపాయిలు. |
| అభిమానులకు సం॥కి | 5రూపాయిలు. |
| పోషకులకు సం॥కి | 10రూపాయిలు. |

 వలయువారు మేనేజరు

సత్తిరాజు సీతారామయ్య

హిందూసుందరి ఆఫీసు కంతేరు.

కంతేరు బ్రాంచిపోష్టు కృష్ణా.